## 5. శృంగారరసతరంగిణి.

ఇది ప్రాచీనప్రబంధములనుండి శృంగారరసప్రధానములగు పద్యముల సేకరించి శ్రీ గంటి సూర్యనారాయణశాస్త్రిగారిచేఁ బ్రకటింపఁబడినది. గద్యతరంగము ముందుఁ బ్రకటింపఁబడును. గ్రంథకర్తలు విజయనగరమున నుండి శృంగారగ్రంథమాలయందుఁ బెక్కుగ్రంథములఁ బ్రకటించియుండిరి. వీరిప్పుడు ఆంధ్రవిజ్ఞానమండలియందుఁ బ్రాచీన ప్రబంధములఁ బ్రకటింపఁజేయుచున్నారు. వీరియాంధ్రభాషాభిమాన మాయా గ్రంథములప్రకటనముచేతనే సువ్యక్తమగుచున్నది. ఈగ్రంథప్రకటనమున వారియాశయము మున్నుడియందుఁ దెలుపఁబడినది. 'కామోద్వృత్తికిఁగాక ప్రాజ్ఞులకు సత్కావ్యార్థభావప్రసూనామోదార్థము నేర్చికూర్చియిడితి న్నానందముం జెందరే' యని వారందు వ్రాసియున్నారు. ఆంధ్రభాషాభిమానులాయాప్రాచీన ప్రబంధములలో శృంగారపద్యములఁ బఠించి యానందమునుగాంతురుగాక. పదునాలుగ్రంథములనుండి పద్యములిందు సమకూర్పఁబడినవి, వెల రు 1—0—0.

---

## 6. హిందూమతము. (Hinduism)

కొవ్వూరు సంస్కృతకళాశాలాధ్యక్షులగు శ్రీ జటావల్లభుల పురుషోత్తము ఎం. ఏ. గారిచే రచింపఁబడినది. గ్రంథకర్త లిదివఱలో వేదకాలపుస్త్రీలు, స్మృతికాలపుస్త్రీలను గ్రంథములను రచించి ప్రకటించియున్నారు. వీరికి హిందూమతమునందును, యామతసిద్ధాంతములందును యభినివేశ మెక్కువ. శ్రుతిస్మృతిసదాచారములచే నిర్ణయింపఁబడిన హిందూమతధర్మములెల్లరకు సుబోధకములగునట్లు సులభశైలి నీగ్రంథము రచియింపఁబడినది. పీఠికయందలి పండితాగ్రేసరుల సదభిప్రాయములవలననే దీనియుత్కృష్టత తెలియఁగలదు. పాశ్చాత్యప్రపంచవిజ్ఞానసంఘర్షణముచే క్షీణించుచున్న హిందూమతమునకు నేఁటిదినములలో నిట్టిగ్రంథము లత్యావశ్యకములు. ప్రతిబాలుఁడు న

జదివి గ్రహింపఁదగిన విషయము లిందెన్నేనిగలవు. గ్రంథమున నాయా ప్రమాణముల యర్థమును మాత్రము నిర్వచించి గ్రంథకర్త లాప్రమాణముల నధోజ్ఞాపికలయం దిచ్చినచోఁ గ్రంథమింకను పఠనీయానుకూలమైయుండును. 'హిందూ'శబ్దమును గూర్చి యుపోద్ఘాతమునఁ దెలుపఁబడినది. హిందూమతమనిన శ్రుతిస్మృతిపురాణేతిహాసనిబద్ధమగు మతమని వీరియాశయము. బౌద్ధాదిమతములు హిందూమతమునందలి విషయములఁ గొన్నిటిని గ్రహించినను, యవి హిందూమతాంతర్భూతములు గావని వీరు తెలుపుచున్నారు, బౌద్ధులు, జైనులు, సిక్కులు, ఆర్యబ్రహ్మసామాజికులును హిందువులైనను ప్రాచీన మతసంప్రదాయములలోఁ గొన్నిటిని త్యజించి భిన్నసంస్థలుగ నేర్పడియున్నారు. ఆయాసంస్థల సిద్ధాంతములనుదెలుపుట గ్రంథకర్తలయుద్దేశము కాదు. ఈగ్రంథమునఁ గొన్నిభాగము లిదివఱలోఁ త్రిలిఙ్గ, దివ్యవాణి, మోక్షసాధని మున్నగు పత్రికలఁ బ్రకటింపఁబడియున్నవి. ప్రథమాధ్యాయమున వేదాదిగ్రంథములప్రామాణ్యమును, ద్వితీయమున గ్రంథప్రయోజనమును, సనాతనధర్మపునరుద్ధరణావశ్యకతయుఁ దెలుపఁబడినవి. మూఁడవయధ్యాయమున వర్ణవ్యవస్థయు, ప్రత్యేకధర్మములును, నిరూపింపఁబడి, యిదిజాతీయతకు విరుద్ధముకాదని సిద్ధాంతీకరింపఁబడినది. (nationalism) నాల్గవయధ్యాయమున చతురాశ్రమములు వానిధర్మములును, పంచమమున నిత్యనైమిత్తిక కర్మములును, వానియాచరణవిధానమును, నాఱవ యధ్యాయమున దయా శాంతి శౌచము మొదలగు సష్టగుణముల స్వరూపప్రాధాన్యమును వర్ణితములు; సప్తమాధ్యాయమున స్త్రీస్వాతంత్ర్యము, దాంపత్యము మొదలగువిషయములు ప్రాచీనదృక్పథమున విమర్శింపఁబడినవి. అష్టమాధ్యాయమున భగవంతునిగూర్చియు, నేకేశ్వరోపాసనము, శివవిష్ణు బ్రహ్మాదిదేవతాయర్చనములఁ గల సామరస్యమును, ఉపాసనాపద్ధతి ప్రయోజనమును గలవు. ఈగ్రంథమునఁ దెలుపబడినవిషయములలోఁ గొన్నిసంఘసంస్కారకులకును, స్త్రీ సమాజములకును వెగటుగఁ దోఁప

వచ్చును. కాని ప్రాచీనదృక్పథము ననుసరించి రచింపఁబడుటచే నట్టిది తప్పదు. ప్రాచీనసంప్రదాయముల ననుసరించి రచింపఁబడిన యీగ్రంథముహిందూమతసిద్ధాంతములనుసులభమగు తెలుఁగుభాషనుదెలుపుచు జిజ్ఞాసువుల కత్యంతోపకారకముగ నున్నది. గ్రంథకర్త లాయాతావుల జైనబౌద్ధాదియవాంతరమతసిద్ధాంతములను దిఙ్మాత్రముగ సూచించిన బాగుండునని తోఁచును.

వెల 0-12-0

---

## 7. భారతీయనాగరికత.

అహింసాతత్త్వము (మొదటి భాగము). ఈ గ్రంథము మహాత్మాగాంధి, నెహ్రు, బోసు, తాతా, అబ్దుల్ కలాం ఆజాద్ మున్నగు సుప్రసిద్ధనాయకుల చరిత్రములను, వెల్సుగారి జగత్కథ కనువాదమును రచించిన శ్రీ కామాండూరి శఠకోపాచార్యులు. ఎం. ఏ. బి. ఎల్ గారిచే రచింపఁబడినది. ఇందలి విషయ మపూర్వమైనది. ప్రాచ్యపాశ్చాత్యదేశముల నవ్యనాగరికతా విజృంభణమును, పరస్పరయుద్ధములును విస్తరిల్లుచున్నదినములలో గాంధిమహాత్ముని యహింసాప్రచారమున కనుబంధముగ వేదస్మృతిపురాణేతిహాసయుగముల జరిగిన వృత్తాంతములనుబట్టి యహింసాతత్త్వప్రాధాన్య మిందు నిరూపింపఁబడినది. వేదములు, ఉపనిషత్తులు, స్మృతులు, జైన బౌద్ధవాఙ్మయములనుండియుఁ బెక్కు ప్రమాణము లాయాతావుల నీయఁబడినవి. రామాయణ మహాభారతములు, కావ్యనాటకాదిగ్రంథములును అహింసాతత్త్వమున కెట్టి ప్రాధాన్యమిచ్చుచున్నవో తెలుపుటకై యాయాకథలు విమర్శింపఁబడినవి. తరువాత మతప్రచారకులగు రామానందు, కబీరు, తులసీదాసు, వల్లభాచార్యులు, నానక్ మొదలగు సుప్రసిద్ధ మహాపురుషుల చరిత్రములు, వారివారిసిద్ధాంతములు, అహింసాతత్త్వ పరిణామములును దెలుపఁబడినవి. మహమ్మదీయ మతసంఘర్షణముచే నేర్పడిన పరిణామము నిరూ

పింపఁబడినది. పాశ్చాత్యనాగరికతను విడచి, యహింసాతత్త్వ మవలంబించి, నూతనశకారంభ మొనర్పవలయునను గాంధిమహాత్ముని యాశయముల ననుసరించి యహింసాతత్త్వపరిణామమునుగూర్చి యొకగ్రంథమును రచింపవలసినదని ఆంధ్రరాష్ట్రకాంగ్రెసుసంఘమువారు కోరినందున గ్రంథకర్త లీగ్రంథమును రచించి ప్రకటించియున్నారు. నేటి నాగరికత యనర్థదాయకమనియు, నహింసాతత్త్వమే ప్రశస్త మనియు, నదియే మనభారతీయ సంస్కృతియందు నిరూపితమనియు వీరు సిద్ధాంతీకరించియున్నారు. ఇందలి విషయములు పాశ్చాత్యనాగరికతావ్యామోహితు లగువారికిఁ గటువుగ నుండవచ్చును. కొంద అహింస యనునది గ్రంథములందును, మహాత్ములయందును గన వగునుగాని సామాన్యజనదుర్లభమని తలంతురు. అదియు నేటి యాంత్రికయుగమున దుస్సాధ్యమని యందురు. గ్రంథకర్తలకును వీరికిని నేకాభిప్రాయ మెన్నటికి నుండఁజాలదు. అహింసయే మానవజాతి కభ్యుదయకారణమను మహాత్ముని యాశయమును నమ్మి గ్రంథకర్త లీగ్రంథమును రచించియున్నారు. మానవుఁ డరిషడ్వర్గములకులోనై తాత్కాలికముగ హింసావిధానము నవలంబించినను, పరధనపరరాజ్యాపహరణాదికముల నొనర్చినను, అహింసయే యతని పరమావధియని యంగీకరింపక తప్పదు. అదియే యతని మహదాశయముగ నుండవలయుననుట నిర్వివాదాంశము. పెక్కుగ్రంథములను, ఉపాఖ్యానాదులను బరిశోధించి యహింసాతత్త్వప్రాధాన్యము నిరూపింప యత్నించిన గ్రంథకర్తల పరిశ్రమ మత్యంతప్రశంసనీయము. దీనిద్వితీయభాగమునుగూడ రచించి గ్రంథకర్తలు తమయుద్దేశమును సఫలీకృత మొనర్తురుగాక.

---

## 8. శ్రీహనుమద్భగవద్గీత.

ఇది అవధాని కవిశేఖర అబ్బరాజు హనుమంతరాయశర్మపాకయాజిగారిచే రచింపఁబడిన యాంధ్రానువాదసహితమగు గీతాప్రవ

ధము. తిక్కనాదు లీభారతభాగము ననువదింపకపోయినను, సామాన్య జనుల యుపయోగార్థము భగవద్గీతల కిటీవలఁ బెక్కుభాషలయందుఁ బెక్కురీతుల ననువాదములు, వ్యాఖ్యానములు, బయలుదేఱినవి. ఇంకను బయలుదేఱుచున్నవి. అవియన్నియు గ్రంథప్రాశస్త్యసూచకములు. ఈ యుద్గ్రంథమును భక్తితో నెంద రెన్నివిధముల రచించినను శ్లాఘ్యమే. హనుమంతరాయకవిశేఖరులచే రచింపఁబడుటచే నిది హనుమద్భగవద్గీత యైనది. గ్రంథము తేటగీతముల సులభముగ నర్థమగునట్లు వ్రాయఁబడినది. గ్రంథాలయోద్యమప్రచారకులగు శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యగారి ప్రోత్సాహమున రచింపఁబడి వారికంకిత మొనర్పఁబడినది. బెజవాడ హనుమద్గ్రంథమండలి వారిచేఁ బ్రకటితము. మచ్చునకు రెండు పద్యములు.

తే. గీ. కలుగుఁ బ్రాణులు నన్నంబువలన, నద్ది
　　వర్షపతియగు పర్జన్యువలన, వాఁడు
　　యజ్ఞములచేత, నయ్యవి యఖిలకర్మ
　　జాతమున భూతలమ్మున జాతమౌను.

తే. గీ. కర్మ వేదంబువలనను గలుగు, బ్రహ్మ
　　మక్షరునివలనను గల్గునట్టుగాన
　　నెల్లెడల వ్యాప్తమగు బ్రహ్మ మెల్లయపుడు
　　యజ్ఞమునయందు నెలకొనం జెలువొందు.　(3–14, 15)

---

## 9. సహజలింగాష్టోత్తర సప్తశతకము.

శ్రీ విద్యారణ్యమహాగురుకృత వేదాంతపంచదశీసారసంగ్రహ స్వరూపమగు నీ గ్రంథము 708 గీతముల శ్రీ ఓలేటి సుబ్బరాయఁడు గారిచే రచింపఁబడినది. ఇందలిగీతములు 'సమరతిసుఖరంగ సహజలింగ' యను మకుటమును దాల్చియున్నవి. దుర్గమములగు వేదాంతవిషయముల నిట్టిగీతములఁ దెలుపఁబూను టందఱికిని సాధ్యముకాదు. అంద

అకును జేటతెల్లమగునట్లు వేమనయోగీంద్రునిపద్ధతిని గవి యనుసరించి నట్లు తోఁచును.

గీ. జ్ఞానియైనవాఁడు సంసారమందున్నఁ
గోఱితలేదు చూడఁ గొంచెమైన
ననుభవింపకున్నఁ బ్రారబ్ధలయమెట్లు ? స॥

గీ. భోగ్యవస్తురాశి భోక్తయు లేకున్న
శోకరూపభోగశూన్యమగును
చతురులేని దివ్వె చందంబు గాదొకో. స॥

---

## 10. విమర్శ వ్యాసములు.

బందరు నోబిలుకళాశాలలో నాంధ్రాధ్యాపకులగు శిష్టారామ కృష్ణశాస్త్రి ఎం. ఏ. గారిచే రచింపఁబడినవి. ఈగ్రంథమున ప్రథమ వ్యాసము వాఙ్మయతత్త్వమును గూర్చినది. అందలి సిద్ధాంతముల కను గుణముగ నన్నయయుగము, సభాపర్వము, పోతన యను మూఁడు వ్యాసములు కలవు గ్రంథకర్తలు పాశ్చాత్య విద్యాప్రవీణు లగుటచే ప్రాచ్యపాశ్చాత్యవిమర్శనముల సమన్వయింప యత్నించి యున్నారు. కానిమార్గములు పృథక్పథములు వేఱుగ నుండుటచే భిన్నాభిప్రాయము లకుఁ దావుగలదు. ప్రాచీన సంస్కృతాంధ్రసాహిత్యమున భాషకును, దానివలన మనకు వ్యక్తమగు నర్థమునకును అవినాభావసంబంధము నిర్ణయింపఁబడుటయేగాక గ్రంథములు, దోషరహితములు, గుణయుత ములు, సాలంకారములగు శబ్దార్థములకలయికగా నిర్వచింపఁబడినవి. దానిననుసరించియే విమర్శనగ్రంథములు రచింపబడినవి. కావ్యాత్మ యెద్ది యను విషయమున రీతి, ధ్వని, వక్రోక్తి, రసము మొదలగువాని కొక్కొకరయాలంకారికుఁడును ప్రాధాన్యమొసంగియున్నారు. కావ్యప్రయోజనము, కవులయాదర్శములనుగూర్చియు మనపూర్వులమార్గము పాశ్చాత్యవిమర్శనమునకు భిన్నముగనడచినది. ఉత్తమకావ్యమునకు నీతి

కిని సంబంధమేర్పడినది. 'రామాదివదాచరితవ్యం నతు రావణాదివత్' అని నియమమేర్పడినది. మఱియు కావ్యదోషములను 'శ్విత్రేణైకేన దుర్భగ'మ్మని వారు నిరసించిరి. శబ్దప్రయోగమునుగూర్చి 'ఏకఃశబ్దః సుప్రయుక్తః స్వర్గేలోకే కామధుగ్భవతి'యని వారు ప్రశంసించిరి. కావ్యములు శ్రోతలకానందమును గలుగఁజేయుచు నీతిబోధకముగనుండి సర్వకాలములయందును ప్రశంసింపఁదగు నితివృత్తముతో రచింపఁబడినవి. అందుచనే శాకుంతలాది నాటకములు పెక్కుసంవత్సరములు గతించినను నేఁటికిని సహృదయానందకరములై యున్నవి. నేఁడు పాశ్చాత్యవాఙ్మయమును గమ్యముగ నేర్పఱచుకొని మనకవులు తాత్కాలికవిషయముల వర్ణించుచు నవలలు, నాటకములు, కథలు రచించుచున్నారు. శ్రీ శాస్త్రిగారు పాశ్చాత్యవిమర్శనపద్ధతినిగైకొని ప్రథమవ్యాసమును రచించిరి. మత సాంఘిక రాజకీయ విషయములకును వాఙ్మయమునకును గల సంబంధమునుగూడ సంగ్రహముగ వీరు చర్చించియున్నారు. ఆదృక్పథముతోడనే మిగిలిన వ్యాసములు రచింపఁబడినవి. భారతరచనకుఁగల కారణము శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారి పద్ధతిని నన్నయకుఁగల వైదికదృష్టి యని నిర్వచింపఁబడినవి. ఆంధ్రవాఙ్మయోత్పత్తికిని భారతరచనమునకును పెక్కుకారణములు గలవు. నన్నయరచనము వైదికరచనమనియు తిక్కనాదులు లౌకికకావ్యదృష్టులతోఁ దమగ్రంథముల రచించిరనియు నూహించుట సమంజసముకాదు. రాజనరేంద్రుఁడు రసభావభాసుర పదార్థవచనరచనావిశారదులైన మహాకవులనేకులున్నను పురోహితుఁడగునన్నయభట్టువైపునకుఁ దనదృష్టిని మరల్చెననుట యతిసాహసమగుటయేగాక నన్నయకవిత్వమునకు న్యూనతనాపాదించుచున్నది. కేవలమాంధ్రమే గాక (తమిళముదప్ప) మిగిలిన దేశభాషలన్నియు సుమారు పదియవశతాబ్దము నాఁటికిఁ దలలెత్తసాగినవి. సంస్కృతప్రాకృతాది భాషలు క్రమక్రమముగ క్షీణించుటవలనను జైనబౌద్ధమతసంపర్కమువలనను, దేశభాషలకు గౌరవము హెచ్చి యాయాభాషల గ్రంథరచనము ప్రబలినది. అందును

పెక్కుభాషలయందు రామాయణ భారతాంధ్రీకరణములు ప్రాచీనగ్రంథములైనవి. వైదికమతోద్ధరణము, సనాతనమతసంరక్షణమును నన్నయ భారతరచనమున నతనియాదర్శములనుట పొరపాటు.

“నన్నయ శైలి పురాణశైలి.” “కవితాలక్షణము లన్నియుఁ బరిమితముగా వ్యక్తీకరించుటచే నతఁ డుత్కృష్ట కవితాశిల్పమునందు మాత్రము సిద్ధహస్తుఁడు గాలేకపోయినాఁడు.” ‘నన్నయ కిట్టిలోకవ్యవహారదృష్టియు సహృదయత్వమును లేకపోలేదు, గాని తక్కువ. ప్రత్యక్షస్వానుభవమును గొఱఁతయే. పూర్వమీమాంసమతావలంబియై నిత్యము త్రికాలములం దగ్నిహోత్రాదికర్మలఁ జేయు ప్రవరాఖ్యుని వంటి నైష్ఠికుఁడైన కర్మఠుఁడగుటచే నితనికి యజ్ఞయాగాదికర్మలయందున్నంత యభిలాష యితరవ్యవహారములందు లేదు.’ ఇట్టి విమర్శనా వాక్యములను సహృదయు లంగీకరింపఁజాలరు. నన్నయ తిక్కనలకుఁ గల తారతమ్యమును జూపి నన్నయ వైదికపద్ధతిని, తిక్కన శిల్పకళా నైపుణ్యమును గనఁబఱచుటకు నారణ్యోద్యోగపర్వములఁ గల ద్రౌపది తన పరాభవమును కృష్ణున కెఱింగించుట యను నితివృత్తమును గైకొని తీవ్రవిమర్శన మొనర్చి నన్నయ వర్ణన మసభ్యముగను, పచ్చిగ నున్న దనికూడ వీరు నిర్ణయించియున్నారు. ఏదోయొక్క విషయము మనమున నిడుకొని తదనుగుణముగ విమర్శనమొనర్చినచో నిట్లే యుండును.

సభాపర్వమను వ్యాసమున నాపర్వము భారతమునఁ బూర్వోత్తర కథలకైక్యముఁ గొలుపుచున్నదనియు, నందువలన భారతమంతయు సభాపర్వకథపైననే యాధారపడియున్నదనియు వివరింపఁబడినది. మూఁడవ వ్యాసమున పోతన భక్తిమయైకదృష్టితో భాగవతము రచించుట విస్తరింపఁబడినది.

---

## 11. సూర్యసాముద్రికము.

కాకినాడవాస్తవ్యులగు సాముద్రికశిరోమణి, జోతుల సూర్య నారాయణమూర్తిగారిచే రచింపఁబడినది.    వెల రు 3-0-0

సాముద్రికశాస్త్రము భారతదేశమునకుఁ జిరపరిచితమైనను, నాంధ్రదేశమున నాశాస్త్రగ్రంథములు లేకపోవుటఁజేసి గ్రంథకర్తలు విపులమగు గ్రంథమును రచించి ప్రకటించిరి. వీ రాంగ్లభాషాపాండిత్యము గలవా రగుటచే సెయింట్ జర్మెయిన్, ఆలెక్‌లిరో, కీరో బెన్హాము మొదలగువారి యాంగ్లగ్రంథముల నాధారముగఁ గొని వాని యందలి ముఖ్యసూత్రముల కనుగుణముగ నిరువదియేడధ్యాయముల గ్రంథమును రచించిరి. పాశ్చాత్యశాస్త్రమున కనుకూలమగుతావుల సంస్కృతగ్రంథములనుండి శ్లోకము లుదాహరింపఁబడినవి. ఈశాస్త్ర విషయముననుగూడఁ బ్రాచ్యపాశ్చాత్యులమతము భిన్నమార్గములను నడచినది. హస్తరేఖలు వానిఫలితములును భిన్నములే. సుప్రసిద్ధ పాశ్చాత్యగ్రంథసాహాయ్యమున గ్రంథకర్త లీగ్రంథమును రచించియుండుటచే నది పాఠకులకు మిక్కిలి యుపయోగముగ నుండునని మన మూహింపనగును. ఇట్టి శాస్త్రగ్రంథములందలి విషయములు గ్రంథకర్తలు దెలిపినరీతిని వేగిరపాటు నొందక యోరిమితో విమర్శ నొనర్చి గ్రహింపవలయును. పాఠకుల సౌకర్యమునకై పెక్కుచిత్రము లీయఁ బడినవి.

---

## 12. కమ్మవారిచరిత్రము, ద్వితీయభాగము.

శ్రీ కొత్త భావయ్యచౌదరిగారిచే రచింపబడినది.    వెల రు 1-4-0

ఇందలి ప్రథమభాగము పరిషత్పత్రిక సం॥ 28 పుట 374 యందు విమర్శింపఁబడినది. కమ్మవారు ప్రాచీనాంధ్రక్షత్రియు లనియు చోడ, దుర్జయ, చాళుక్య, హైహయ రాజవంశములనుండి కమ్మవంశ

మేర్పడినదనియు గ్రంథకర్తలు నిరూపించుటకై శ్రమవహించి యీ గ్రంథమును రచించియున్నారు. ప్రాచీనక్షత్రియవంశములు కమ్మ, వెలమ, రాచవారలుగాఁ జీలిరనియు, రెడ్డి, కాపు సంఘములనుండి కమ్మవా రేర్పడియుండలేదనియు, కమ్మవారు తరువాత చోదరులై రనియుఁ బ్రథమభాగమునఁ జర్చింపఁబడినది. కొంతవఱకు క్రీ. శ 10 వ శతాబ్దము పూర్వపుకమ్మవారి చరిత్రయును గలదు.

రెండవభాగమున నాయావంశములఁగలసుప్రసిద్ధపురుషులచరిత్ర సంగ్రహముగ నొసంగఁబడినది. ప్రాచీనక్షత్రియవంశపురాజులు తమకుఁ బూర్వులని విశ్వసించియుండుటచే గ్రంథకర్త లీ రెండవభాగమున నాయాక్షత్రియవంశవీరులచరిత్రమును వర్ణించియున్నారు. కమ్మవారిగృహనామములు గోత్రములు రెండుభాగములందు నీయఁబడినవి. మూఁడవ భాగమునుగూడ నచిరకాలముననే ప్రకటింతుమని గ్రంథకర్తలు పీఠిక యందు వ్రాసియున్నారు. జిజ్ఞాసువులు సహృదయులై గ్రంథమును దిలకింతురుగాక.

---

**13. జైనసిద్ధాంతభాస్కర.** సంపు. 8. కిరణ. 1.

14. The Jaina Antiquary - Vol. VII - No. 1.

ఈ రెండు పత్త్రికలు నొకటి హిందీభాషలోను రెండవది యాంగ్లమునందును జైనపురాతత్త్వేతిహాస విషయములనుగూర్చి బీహారుదేశమున ఆరా పట్టణమున నెలకొల్పఁబడిన జైనసిద్ధాంతభవనమువారిచేఁ బ్రకటింపఁబడుచున్న షాణ్మాసిక పత్త్రికలై యున్నవి. ఇందు జైనపురాణములు, శాసనములు, తీర్థంకరులనుగూర్చియు, వాఙ్మయమునుగూర్చియు మిక్కిలి యమూల్యములగు వ్యాసములు గలవు.

సంవత్సరచందా రు 3-0-0.

**The Jaina Antiquary in English & the Jaina Siddhanta Bhaskar in Hindi are issued once in six months by the Jaina Siddhanta Bhavana, Arrah, Bihar. The journals contain valuable articles regarding Jainism in its Literary, Historical & Philosophical aspects, and extremely useful to scholars. We wish the journals a long life of research in the unexplored regions of Jaina thought, literature and History. Yearly subscription for both is Rs. 3 only.**

తన యకుంఠిత శక్తిచే నీలోకమును నడిపించుచున్నట్టియు నొక య
శ్య మగు శక్తి కల దని మానవుఁడు గ్రహించి తన కెయ్యది శ్రే
దాయకమో, శ్రుతియుక్త్యనుభవములవలన, నెఱింగి ధర్మయ
ముగ నాతఁడు నడుచుకొనునేని భగవానుఁడు చెప్పినట్లుగ "దద
బుద్ధియోగం తం యేన మా ముపయాంతి తే" యట్టి మానవునకు
భ్రంశము గాకుండ నీ భూతప్రకృతియుఁ గాలకర్మలును, దైవమునుగ
సహాయ మొనరింతురు. అటులగాక ధర్మవ్యతిరిక్త మగు సర్థక
ముల నార్జించుటకు మనుజుఁడు గడంగెనేని రామచంద్రుఁడనిన టుల

శ్లో. అర్థధర్మౌ పరిత్యజ్య యః కామ మనువర్తతే
ఏవ మాపద్యతే క్షిప్రం రాజా దశరథో యథా".

ధర్మార్థములను వదలి కామవశంగతుఁడు మానవుఁ డయ్యెనేని య
ముగ దశరథునివలె నాపదలం దతఁడు చిక్కుకొనక మానఁ డని మ
దశరథపాత్రము బోధించుచున్నది. పురోహితునితోనైన నాలోచిం
'రేపు రామున కభిషేకము సేయించెద'నని ప్రతిజ్ఞచేసె నా నృపాలుఁ
అన్నియు సమకూర్చెను. సర్వసిద్ధమైన యత్నము త్రుటిలో రఘుం
మారుతములోని తూలికవలె నెగిరిపోయెను! ఇంతకన్న మాన
యస్వతంత్రకు నిదర్శన మేమి కావలెను! దశరథుఁడు ప్రాజ్ఞుఁడా! కా
మహావిద్వాంసుఁడు. వశిష్ఠ శిష్యుఁడు. అందుచేతనే భరతుఁ డీ టి
విలపించెను.

శ్లో॥ "తాతం న పరిగచ్ఛేయం దైవతం చేతిసంపది।
కోహిధర్మార్థయో ర్హీన మీదృశం కర్మ కిల్బిషమ్॥"

# కాశీఖండము–పాఠభేదములు.

వ్యాకరణవిద్యాప్రవీణ–విద్వాన్ చిలుకూరి పాపయ్యశాస్త్రి.

శబ్దబ్రహ్మంబు కారణబింద్వాత్మకంబై బిందునిష్యందత్వంబునకుం బురుషేచ్ఛాప్రయత్నంబున మూలాధారావస్థిత పవనసంధుక్షణంబునం జేసి యభివ్యక్తంబై పరావాక్కనంబడు. ఆబ్రహ్మంబీ నాభిపర్యంతం బావాయువుచే నభివ్యజ్యమానంబై మనంబుతోడం గూడి, సామాన్యస్పంద ప్రకాశరూపిణియుఁ గావ్యబిందు తత్త్వాత్మికయు నీశ్వరాధిదేవతయు నై పశ్యంతీవాక్కనంబడు. ఆ బ్రహ్మంబా వాయువుచేత హృదయపర్యంతంబై విశేషస్యందరూపయు నాదబిందుమయియు హిరణ్యగర్భాధిదేవతయునై మధ్యమవాక్కనంబడు. కాశీ 8 అ. 49 వచనము.

ఇత్యాది ముద్రితప్రతులందలి పాఠము. అగస్త్యుఁడు లక్ష్మీదేవిని, పరాశక్తిగ భావించి స్తుతింపనవసరమున నామె పరతత్త్వమును బైరీతిగ కవి వర్ణించినాఁడు. ఈవిషయము సంస్కృతము కాశీఖండమున నీతావున లేనిదియే. ఇదియు మంత్రశాస్త్రసంప్రదాయానుగతము.

శ్లో. మూలాధారా త్ప్రథమ ముదితో యశ్చ భావః పరాఖ్యః
పశ్చా త్పశ్య న్త్యథ హృదయగో బుద్ధియుఙ్మధ్యమాఖ్యః
వ్యక్తే వైఖర్యథ రురుదిషో రస్య జంతో స్సుషుమ్నా
బంధ స్తస్మా ద్భవతి పవనప్రేరితా వర్ణసంజ్ఞా.

అను నీయాచార్యసూక్తి కీవచనరచన చాలవఱకు సరిపడియున్నది. కాని వ్రాఁతప్రతులు పెక్కింటిలోఁ బై రేఖాంకితస్థలములందుఁ గ్రమముగ స్పందప్రకాశరూపిణియు, కార్యబిందుతత్త్వాత్మికయు, విశేషస్పందరూపయు, ననుపాఠములే గానవచ్చుచున్నవి. ముద్రితప్రతులందలి పాఠములెట్లును సరిపడవు. స్పందస్వరూపిణి గాదామె. స్పందస్వరూపిణియే.

శ్లో. యదయ మనుత్తరమూర్తిః నిజేచ్ఛయా జగత్స్రష్టుం
　ప్రస్పందే సస్పందః ప్రథమః శివతత్త్వ ముచ్యతే తజ్జ్ఞైః

అను తత్త్వసందోహ వాక్యంబుచే, ప్రాణ్యదృష్టవశమున పరా శక్తికి జగత్ సిసృక్షగల్గినపు డేర్పడు కదలికయే స్పందమనఁబడును. అట్టి స్పందస్వరూపిణి యని తెలుపుటకే 'స్పందప్రకాశ రూపిణి, యనినాఁడు.'

"అస్మాచ్చ కారణబిందోః, సాక్షాత్క్రమేణ కార్యబిందుః, తతో నాదః తతో బీజమితి త్రయ ముత్పన్నం, తదిదం పరసూక్ష్మస్థూలపదై రప్యుచ్యతే" అను భాస్కరాచార్యుని వచనరీతిని కార్యబిందు స్వరూపిణి గాని, కావ్యబిందు స్వరూపిణి గాదు. కావున నీతావులందుఁ దాటియాకు ప్రతులందలి పాఠములే సమంజసములు.

క. కర్ణికాంతము సేరి యేకతమ శివుఁడు
　మునుపు మోక్షచింతామణి జనునకిచ్చుఁ
　గాన మణికర్ణికాసమాఖ్యత వహించె
　నమ్మహాతీర్థ మమర గంగాతటమున.

కాశీ. 3 ఆ. 96 ప.

ఈ తుది ముద్రితప్రతులందలి పాఠము. "శివుఁడు కర్ణసమీపముఁ జేరి, ఏకాంతముగఁ బూర్వము మోక్షచింతామణియగు తారకమంత్ర మునుపదేశించునుగాన నీ మహాతీర్థం బాగంగాతటమున మణికర్ణిక యను పేరును వహించెను" అని ముద్రితపాఠమునకర్థము.

ఇఁక నీపద్యమునకు మూలమయిన సంస్కృతకాశీఖండమునందలి శ్లోకమును, తదర్థమును బరికింతము.

శ్లో. సంసారచింతామణి రత్రయస్మాత్
　తత్తారకం సజ్జనకర్ణికాయామ్
　శివోఽభిధత్తే సహ సాంతకాలే
　తద్గీయతేఽసౌ మణికర్ణికేతి.

ఈ తీర్థమున సజ్జనులకర్ణమునందుఁ జరమకాలమున సంసారచింతామణియగు శివుఁడు తారకమంత్రము నుపదేశించునుగాన నిది మణికర్ణిక యని కీర్తింపఁబడుచున్నదని పైశ్లోకమునకర్థము. పై ముద్రితపాఠమును బట్టి మరణకాలమునకుఁ బూర్వము శివుఁడు మోక్షచింతామణియగు తారకమును జనులకిచ్చునను నర్థము లభ్యమగుచున్నది. అయ్యది మూలమునకు సర్వథావిరుద్ధము.

వ్రాఁతప్రతులందెచ్చటను నీటిపాఠము గానరాదు. ఆయా ప్రతులందు 'మునుకు మోక్షచింతామణి జనులకిందు' అనుపాఠమే గానవచ్చుచున్నది. మునుకుట అనఁగా నుపదేశించుట, లేక మెల్లఁగాఁ జెప్పుట. అనఁగా శివుఁడు ఈ క్షేత్రమున మరణించువారి కాసమయమున మోక్షచింతామణియగు తారకము నేకాంతముగ నుపదేశించునని యర్థము. ఈయర్థమున మూలమగు సంస్కృతశ్లోకముతో విరోధమును లేదు.

కావున నేచిన్నయసూరిగారు, మునుకుట ఉపదేశించుట-మెల్లఁగాఁ జెప్పుట యను నర్థమును వ్రాసికొని 'మునుకు మోక్షచింతామణి జనులకిందు'అను పాఠమునే తమ నిఘంటుపదసూచికయందు సేకరించి యున్నారు. ఈ యర్థముననే శ్రీనాథుఁడీప్రయోగమును బ్రయోగించి యున్నాఁడు.

మ. శ్రుతపూర్వంబగు విశ్వమోహన కళాశోభా విశేషంబు సం
స్మృతి నూహింపఁగఁ జాయవాఱుటయుఁ బ్రేమం బాత్మలోఁ గీలుకో
నితఁడే నైషధుఁ డంచు నొండొరులతో నేకాంత మొయ్యొయ్య నా
శతమన్యుప్రముఖామరుల్ మునుకుచుం జర్చించి రుత్కంఠతోన్.

నైష. 3 ఆ. 42 ప.

మఱియుఁ బై పద్యమున గంగాతటమున అనుచోట 'గంగాంతరమున' అనియే వ్రాఁతప్రతులన్నింటియందలి పాఠము. తీర్థమునుగూర్చి తెలుపుటగాన నిదియే సరియయినది.

ఉ. తప్పనిచోట తప్పనుచుఁ దప్పని యారసి మానఁజోరుఁడీ
తప్పినఁ దప్పు గల్గెనని తప్పని సత్కృపమీఱ దిద్దుఁడీ
యొప్పులొకింత గల్గ మదినుబ్బుఁడు పండితులార మీకు నేఁ
దప్పని శిష్యుఁడన్ గురులఁదప్పనె శిష్యునకీర్తి కీర్తియున్.

ఇది, శ్రీ మత్సీతారామచరణారవింద మిళిందాంతఃకరణేన శ్రీ మత్పోలూరి మాధవయజ్వపండితాఖండల సముజ్జ్వల తత్కృపారససము త్థిత కటాక్షాసాదిత పాండిత్యాభరణేన ప్రభంజనవంశకలశపాథోధి శరద్రాకాశశాంకేన నిరంతరారాధితవిచక్షణశశాంకేన అభినవశబ్దశాసన బిరుదాభిధానవతా అహోబలపతి సంఖ్యావతా విరచితాయా మంధ్రశబ్దచింతామణి వ్యాఖ్యాయాం కవిశిరోభూషణాఖ్యాయాం పంచమః క్రియాపరిచ్ఛేదస్సమాప్తః.

## 11. అహోబలపండితీయము 4601.

ఇది ఆంధ్రశబ్దచింతామణికి సంస్కృతవ్యాఖ్యానము. ఇందు 89 పత్రములుగలవు. వ్రాఁతచక్కనిది. తప్పులుమెండు. సంధిపరిచ్ఛేదము మొదలుగఁ దుదివఱకుఁగలదు. "రాజశ్రీ దామెర వెంకటాద్రియ్యం గారికి దేవులపల్లి కృష్ణయ్య అహోబలపండితీయమనే గ్రంథమును వ్రాశి దాఖలుచేశెను. విశ్వావసుసం॥ కార్తిక బ॥ ౧౨ బుధవారం" అని తుదిని గలదు. ప్రతిమంచిస్థితిలోనున్నది. ఉన్నంతదనుక గ్రంథపాతములేదు.

గ్రంథారంభము :—

శ్లో. వందే వందారుసందోహమందారం రఘునందనం
సదాభజే సుదేహాంతాం విదేహాధిపనందనాం.

సంధిర్నాచోఽచ్యుతః - ఉకారవ్యతిరిక్తస్యాచోఽచి సంధిర్న భవతి. మేనయత్త - చిన్నియన్న - వన్నెరయొల్లె - రోయీవి - మైరయొరపు ఇంపగు - సొంపగు - రాముఁడతఁడు. కృష్ణుఁడితఁడు ఇత్యాద్యుదాహరణమ్.

వ్యాఖ్యానాంత్యభాగమునఁ బైప్రతిలోనున్న శ్లోకములుఁ పద్యములు గానరావు.

తుదిభాగము :—

తదుక్తంధనంజయాచార్యైః :—

శ్లో. వక్తా వాచస్పతి ర్యత్ర శ్రోతా శక్ర స్తథాపితే
శబ్దపారాయణస్యాంతం నగతౌ తత్ర కేవయం
తథాపికించి త్కస్మైచిత్ ప్రతిబోధాయ సూచితం
బోధయే త్కియదు క్తిజ్ఞో మార్గవత్సహయాతి కిం
ప్రమాణమకలంకస్య పూజ్యపాదస్య లక్షణ' మితి—

అమరసింహాదిశాబ్దికై రపి, విశేషంతుక్షేయం శిష్టప్రయోగత ఇత్యుక్తం. భాషాద్యాదిష్వపి లింగ మశిష్యం లోకాశ్రయత్వాల్లింగస్యేత్యాదినా ప్రయోగానుసారిత్వం బహుధాప్రతిపాదిత మితి సర్వ మతీవశుభం. ఇతిశ్రీమత్సీతారామచరణారవింద మిళిందాంతఃకరణేన శ్రీమత్పోల్లూరి మాధవయజ్వపండితాఖండల సముజ్జ్వలత్కృపారస సముత్క్షితకటాక్షాసాదిత పాండిత్యాభరణేన అహోబలపతి సంఖ్యావతా విరచితాయాం ఆంధ్రశబ్దచింతామణి వ్యాఖ్యాయాం కవిశిరోభూషణాఖ్యాయాం పంచమః క్రియాపరిచ్ఛేదః. శ్రీ శ్రీ శ్రీ.

## 12. అహోబలపండితీయము 4673.

ఇది 100 పుటలుగల కాగితపుప్రతి. శ్రీశ్రీ పిఠాపురము మహారాజావారిచే పరిషద్భాండాగారమున కొసఁగఁబడినది. వ్రాఁత బాగుగనే యున్నది. తప్పు లంతగ లేవు. వ్రాయసగాని పేరు గానరాదు. కొండపల్లి పీచుకాగితములు. అసమగ్రము.

సంధిపరిచ్ఛేదారంభమునుండి, హలన్తపరిచ్ఛేదమునందలి 'నుమ్వా హ్రస్వశ్చాదేరమిశసిచ' అను సూత్రవ్యాఖ్యానము తుదివఱకుఁ గల "భా విఁంపు వ్రాయఁబడినది.

## 13. అహోబలపండితీయము 4674.

ఇది 502 పుటలుగల కాగితపుప్రతి. వ్రాఁత బాగుగనేయున్నది. తప్పులంతగలేవు. పుట లటనటఁ గ్రిమిదష్టములయినను మంచి స్థితిలో నున్నవి. తుదినొక్క పత్రముదక్క మిగిలిన వ్యాఖ్యానభాగమంతయు నిందుఁగలదు. ఇదియు శ్రీమహారాజావారిచేఁ బరిషత్తునకీయఁబడినదియే. పరిచ్ఛేదములయిదును బూర్ణముగఁ గలవు. వ్రాయసగానిపేరు తెలియరాదు.

## 14 అహోబలపండితీయము 4677.

ఇందు 256 పుటలు గలవు. శ్రీజయంతి రామయ్యపంతులుగారి పుస్తకభాండాగారమునుండి పరిషద్భాండాగారమునకుఁ దేఁబడినది. కాగితపుప్రతి. తప్పు లంతగలేవు. వ్రాఁత బాగుగనున్నది పత్రములు పురాతనములయినను మంచిస్థితిలోనున్నవి సమగ్రము. వ్రాయసగానిపేరు తెలియరాదు.

గ్రంథారంభము—'శ్రీమదుర్వ్యభిమితలోదరీ' ఇత్యాదిగనున్నది. కాని, ముద్రితసంపుటమునందువలెఁ దరువాతిశ్లోకములన్నియు నిందుఁ గానరావు 88 శ్లోకములకు 22 మాత్రమే గలవు తొలుత ప్రార్థనా శ్లోకములు రెండుగలవు.

గ్రంథమునఁదుదిభాగము:—

భాష్యాదిష్వపి, 'లింగ మశిష్యం లోకాశ్రయత్వా ల్లింగస్యే'త్యాది న్యాప్రయోగానుసారిత్వం బహుధాప్రతిపాదితమితి సర్వమతీవశుభం.

గద్య:-ఇతిశ్రీమత్సీతారామ.................అహోబల సంఖ్యావతా విరచితాయాం కవిశిరోభూషణాఖ్యాయాం పంచమః క్రియాపరిచ్ఛేదః

## 15. ఆంధ్రశబ్దచింతామణి - సంస్కృతవ్యాఖ్యానము 2607.

ఇందు 46 పత్రములుగలవు. వ్రాఁత బాగుగనేయున్నది. తప్పులంతగలేవు. పత్రము లటనటఁ గ్రిమిదష్టములయినను మంచిస్థితిలో నున్నవి. వ్రాయసగానిపేరు తెలియరాదు.

తొలుత 5 పత్రములు చింతామణి కారికలును, ఆవెనుక 34 పత్రములు చింతామణి కారికలకు సంస్కృతవ్యాఖ్యానమును, పిమ్మట 8 పత్రములు వివిధవిషయములను గూడియున్నవి. టీకరచియించిన వారి పేరు సరిగాఁ దెలియవచ్చుటలేదు. తుదివిమాత్రము "బాలసరస్వతీయ టీకాసహితాంధ్రశబ్దచింతామణి స్సమాప్తః" అనికలదు. ఇంతమాత్ర మున దీనిని బాలసరస్వతిరచియించె ననుటకు వలనుపడకున్నది. ఏలయనఁ బ్రారంభమున అప్పకవినిగూడ స్మరించినట్లు కానవచ్చుచున్నది. కావునఁ దరువాతివారెవరో దీనిని రచియించి బాలసరస్వతి రచియించి నాఁడను టకుఁ దుది నీగద్య వ్రాసినారేమో? కాని యుదాహరణములు, విషయ మును నచ్చులోనున్న బాలసరస్వతీయముతోఁ జాలవఱకు సరిపడు చున్నవి. విమర్శకు లిందలి యథార్థమును నిర్ణయించెదరు గాక.

గ్రంథారంభము :—

శ్లో. నమస్కృత్వా స్వపాఖ్యార్య మధర్వణవిపశ్చితం
తథై వాప్పకవిం చాంధ్రసూత్రవ్యాఖ్యావిరచ్యతే.

విశ్వేతి - కవయతీతి కవిః - తస్య కర్మ కావ్యం - పంకజాదివ ద్యోగరూఢత్వా ద్రసోల్లసితశబ్దార్థాత్మకమేవ - నకర్మమాత్రం - తత్కావ్యం విశ్వశ్రేయః - ప్రపంచశ్రేయస్కరంభవతి. సారోపలక్షణ యా అవ్యభిచారేణ కార్యనిష్పాదకత్వంధ్వనితం. ఏవంచ సకలజనానాం ధర్మాద్యఖిలపురుషార్థప్రద మిదమితి తాత్పర్యం.

పరిచ్ఛేదముల తుదివచనములు :—

ఇతి సకల భాషావాగనుశాసన నన్నయభట్ట విరచితాంధ్రశబ్దచింతా మణౌ ప్రాథమికస్సంజ్ఞా పరిచ్ఛేదః.

ఇతి సకలభాషావాగనుశాసన నన్నయభట్ట కృతాంధ్రశబ్ద చింతామణౌ ద్వితీయస్సంధిపరిచ్ఛేదః.

ఇతి శ్రీ సకలభాషావాగనుశాసన నన్నయభట్ట విరచితాంధ్ర శబ్దచింతా మణౌ తృతీయోఽజన్తపరిచ్ఛేదః.

ఇతి శ్రీ సకలభాషావాగనుశాసన నన్నయభట్ట విరచితాంధ్ర శబ్దచింతామణౌ పంచమః క్రియాపరిచ్ఛేదః వ్యాఖ్యాతస్సమాప్తశ్చ.

బాలసరస్వతీయటీకాసహితాంధ్రశబ్దచింతామణిగ్రంథ స్సంపూర్ణః.

తుదిభాగము :—

అత్వాదీతి, తత్సమానామివ, తత్సమక్రియాణామివ దేశ్యానాం క్రియాపదానాంచ అత్వాదికార్యంస్యాత్, వ్యతిరేకాదా భావినీత్యాది సూత్రేణ విహితాకారాదికార్యాణి తత్సమక్రియాణామివ దేశ్యక్రియాణామపి భవన్తీత్యర్థః, ఉదాహరణం, తత్రతత్రోక్తం. పురుషేషు, అర్థేషు, వచనేషుచ వర్ణాగమః విశేషఃభవతి, ప్రథమపురుషప్రభృతి పురుషేషుచ, వర్తమానార్థప్రభృత్యర్థేషుచ, ఏకవచనప్రభృతివచనేషుచ వర్ణాగమో విశేషతయాభవతీత్యన్వయః. యథా:—ఉన్నాఁడు, రాఁడు, రావించె, కాఁచె, కావఁడు, పోయె, పోతిని, పంపె, చనియె, చనితిని, వినియె, వించె, అయితిని, కాఁడు, కమ్ము, కావించె, చూచున్, చూడఁడు, ఇత్యాదయః.

16. ఆంధ్రశబ్దచింతామణి - తెలుఁగుటీక - 4668.

ఇది 28 పుటలు గల కాగితపు ప్రతి. శ్రీమహారాజావారొసఁగినది. కొండపల్లి పీచుకాగితములపై వ్రాయఁబడినది. వ్రాఁతతీరు బాగుగనే యున్నది. తప్పులంతగలేవు. టీక రచియించినవారెవరో తెలియరాదు. పుటలతుదలు తునిఁగిపోయినవి. వ్రాయసగానిపేరు గానరాదు. తొలుతటి నాలుగుపుటలు లేవు. అసమగ్రము.

'యరలవసహాళంతుహాల్వర్గః' అనుసూత్రము టీకతోనారంభము. అది మొదలుగ 'టాదివిభక్తౌ నిర్ణేత్యేకే' అను సూత్రము టీక తుదివఱకు నిండు వ్రాయఁబడినది.

గ్రంథారంభము :—

హాల్వర్గః - హాల్ =హల్లులయొక్క, వర్గః - సముదాయము, అనఁగా దేశ్యతద్భవాత్మకమయిన యీ యాంధ్రభాషయందుఁగల ముప్పది

క్షింపఁబడినచో ధర్మమే శిక్షింపఁబడినట్లు. ఆర్యమతమున కది విరుద్ధము. కనుక సారంగధరునకుఁ దిరిగి కాలుసేతులు వచ్చినట్లు చిత్రించుట రిగినది. ఈ కథా నిర్మాణమునందలి భావము ద్రావిడ సంస్కరణమున సంస్కారకముగాఁ గల్పింపఁ బడినది. ఈ కథను నుత్తరదేశ సంబంధి నే వారు చిత్రించి యుందురు. "మహాత్ముల కథలను, మహా పురుల జీవితములను దమ తమ యభిజనములకు ననువగుచో నన్వయము సి నతుకు పెట్టుకొని యానందించుట మానవ స్వభావ" (శ్రీ పాల పిచ్చయ్యశాస్త్రి)మగుట మన యాంధ్ర కవులు దానిని రాజరాజ రేంద్రున కంటఁగట్టి యుందురని తలఁచుట సమంజసము.

నవనాథచరిత్రమునందలి కథ. — రాజు రాజమహేంద్రి ధుఁడు. అతఁ డనపత్యుఁడు. శివునిగూర్చి సేవించెను. స్వప్నమున శివుఁడు ప్రత్యక్షమై పట్టపుదేవి యైన రత్నాంగికి సుతుఁ డుద్భవించు ననెను. మె గర్భధరాలస యైనది. కుమారుని గన్నది. అతని పేరు సారంగ రుఁడు. యౌవనప్రాప్తి యైన దాతనికి. ఘూర్జర రాజపుత్రి యైన ంగళాంగితోఁ బరిణయ మైనది. ఒకనాఁడు రాజమహేంద్రుఁడు వేటా ట కడవికిఁ బోయెను. సారంగధరుఁ డు పావురముల యాట యాడు ండెను. అతఁ డెగురవేసిన పావురము రాజమహేంద్రుని భోగసతి త్రాంగి యంతఃపురమున వ్రాలినది. దానిని దెచ్చుకొనుట కాతఁ ద్యుక్తుఁడాయెను. సుబుద్ధి వారించెను. ఇతఁ డాతని మిత్రుఁడు. సారంగ రుఁడు వినక వెళ్ళెను. చిత్రాంగి వానిని శృంగారక్రీడకు దించుటకు యత్నించెను. అతఁడు తిరస్కరించెను. ఆమె బెదరించినది. లాభము దు. తరువాత రా జరుదెంచెను. చిత్రాంగి సారంగధరుని పై నేరా రోపణ చేసి చూపినది. రా జాగ్రహించినాఁడు. సారంగధరుని బంధించి ఱుకుట కాజ్ఞ యిచ్చినాఁడు. మంత్రి మతిమంతుఁ డాలోచించవలసిన గాఁ గోరినాఁడు రాజును. కాని లాభము లేకపోయినది. సారంగధరుఁ

ఇందు సంజ్ఞా సంధి అజంత హలంత క్రియాపరిచ్ఛేదము లయిదును గలవు. పరిచ్ఛేదముల తుదివచనములు:—

ఇతి శ్రీమదథర్వణాచార్య విరచితే గ్రంథే సంజ్ఞాపరిచ్ఛేదః

ఇతి శ్రీమదథర్వణాచార్య విరచితే సంధిపరిచ్ఛేదః

ఇతి శ్రీమదథర్వణాచార్య విరచితేఽజన్తపరిచ్ఛేదః

ఇతిహాలన్త పరిచ్ఛేదః

ఇతి శ్రీ మదథర్వణాచార్యకృతౌ క్రియాపరిచ్ఛేదః

తుదిభాగము:—

శ్లో. భాషేయ మమితా తత్ర దేశ్యా చిత్రస్వభావయుక్
తచ్చిత్రతాతు ద్రష్టవ్యా పూజ్యపాదసుభాషితైః.

శ్లో వక్తా వాచస్పతి ర్యత్రశ్రోతాశక్ర స్తథాపి తౌ
శబ్దపారాయణస్యాంతం నగతౌతత్ర కేవయం.

శ్లో. తథాపి కించిత్కస్మింశ్చి త్ప్రతిబోధాయ సూచితం
బోధయేత్కియదు క్తిజ్ఞో మార్గవిత్సహయాతికిం
ప్రమాణ మకలంకస్య పూజ్యపాదస్యలక్షణం

## 18. అథర్వణకారికావళి 6.

ఇది 53 పుటలుగల కాగితపుప్రతి. కర్రి సాంబమూర్తిశాస్త్రి గారిచే పరిషత్పుస్తకభాండాగారమునందలి 4093, 4094 సంఖ్యలుగల ప్రతులనుజూచి వ్రాయఁబడినది. తొలుత 32 పుటలు కేతన ఆంధ్రభాషాభూషణమును, పిమ్మట 31 పుటలు అథర్వణకారికావళియును గలవు. వ్రాఁతబాగుగనేయున్నది. తప్పులును గలవు.

## 19. ఆంధ్రభాషాభూషణము 4094.

కేతనవిరచితము. ఇందు 19 పత్రములు గలవు. వ్రాఁతబాగుగ లేదు. తప్పులంతగ లేవు. పత్రములటనటఁ గ్రిమిదష్టములు. గ్రంథపాతము లేదు. వ్రాయసగానిపేరు తెలియరాదు.

శా. శ్రీవాణీగిరిజేశ దంతిముఖరాజీవాప్తులం గొల్చి వా
గ్దేవిం జిత్తములోన నిల్పుకొని భక్తి న్శక్తిఁ గీర్తించి నా
నావిద్వత్సభలం వలంగొని వినూత్నప్రౌఢకావ్యక్రియా
ప్రావీణ్యంబున నల్లసిల్లు కవులం బ్రార్థించి ధన్యుండనై.

క. శ్రీదయితా వేదీకృత
యాదోధిపజనితమణిసమంచితవక్షా
ఆదిమమునిసంరక్షా
వేదాంతాభరణచరణ వేంకటరమణా!

అని వినుతించి:—

క. వివిధకళానిపుణుఁడ నభి
నవ దండి యనంగ బుధజనంబులచేతం
భువిఁ బేరుఁ గొన్నవాఁడను
కవిజనమిత్రుండ మూలఘటికాన్వయుఁడన్.

క. ఖ్యాతశుభచరిత్రుఁడ వృష
కేతనపాదద్వయీ నికేతనుఁడనఁగా
కేతన సత్కవి యనఁగా
భూతలమున నతిశతంబుఁ బొందినవాఁడన్.

క. మానయకును నక్కమకును
సూనుఁడమితసత్యనయవచోవిభవుఁడవి
జ్ఞానానూన మనస్కుఁడ
నానాశాస్త్రజ్ఞుఁడను గుణాభిజ్ఞుండన్.

గీ. కవితఁ జెప్పి యుభయకవిమిత్రు మెప్పింప
నరిది బ్రహ్మకైన నతఁడు మెచ్చఁ
బరఁగు దశకుమారచరితంబుఁ జెప్పిన
ప్రౌఢ నన్ను వేత్త పొగడనేల?

క. మున్ను తెనుఁగునకు లక్షణ
మెన్నఁడు నెవ్వరును జెప్ప రేఁ జెప్పెద వి
ద్వన్నికరముముదమెచ్చఁగ
నన్నయభట్టాదికవిజనంబులకరుణన్.

గీ. సంస్కృత ప్రాకృతాది లక్షణముఁ జెప్పి
తెనుఁగునకు లక్షణము మున్ను దెలుపకుంకి
కవిజనంబుల నేరము గాదు నన్ను
ధన్యుఁగావింపఁదలఁచిన తలఁపుగాదె.

క. భాషావేదులు నను విని
యాషణ్ముఖపాణినులకు నగు నెనయుని సం
తోషింప నాంధ్రభాషా
భూషణమను శబ్దశాస్త్ర మొగిఁ గావింతున్.

తుదిభాగము:—

క. తెలుఁగునకును లక్షణ మి
ట్లలవడఁగా దండిచెప్పె నభిధానములన్
గలక్రియలన్నియు నేర్పడఁ
దెలియుఁను సత్కవులు మేలు దేటపడంగాన్.

క. తప్పులు తీర్పను కవులం
దొప్పులు గైకొనుఁడు దీని కోపనివారల్
తప్పొప్పని వెసబుద్ధులు
విప్పకుఁడీ యన్నలార! వేఁడెద మిమ్మున్.

గీ. పాలునీరు నేఱుపఱచు నా కలహంస
రీతి మానయార్య కేతనకవి
యాంధ్రలక్షణంబు నలరంగ రవిచంద్ర
తారకంబుగాఁగఁ దా రచించె.

## 20. ఆంధ్రభాషాభూషణము. 1391.

ఇది 9 పత్రములుగలది. వ్రాఁతచక్కనిది. తప్పులు మెండు. ఈప్రతియందే గౌరన విరచితమయిన లక్షణదీపికయును గలదు. *ప్రారంభము శ్రీవాణీగిరిజేశ ఇత్యాదిగా నున్నది.

తుదిభాగము:—

క. వదలినచుట్టి విభక్తిన్
మొదలి పదాంతాక్షరంబు......పై
పదమాదిమ వర్ణమునున్
గదియంగ సమాసమయ్యెఁ గవిజనవినుతా !

## 21. ఆంధ్రభాషాభూషణము. 1859

ఇందు 27 పత్రములుగలవు. వ్రాఁత బాగుగనే యున్నది. తప్పులంతగ లేవు. తొలుత 12 పత్రములు నరకాసుర విజయవ్యాయోగమును (సంస్కృతము) ఆవెనుక 6 పత్రములు కేతనఆంధ్రభాషాభూషణమును, కడపటి 9 పత్రములు శాకుంతలములోని శ్లోకములు మున్నగునవియుఁ గలవు. పత్రము లటనటఁ గ్రిమిదష్టములయినను మంచి స్థితిలోనున్నవి. గ్రంథారంభము 'శ్రీవాణీగిరిజేశ' ఇత్యాదిగఁగలదు.

తుదిభాగము:—

క. తెలుఁగులకు లక్షణంబుల
నలవడు క్రియ దండిచెప్ప నభిధానములోఁ
గలక్రియ లన్నియు నేర్పడఁ
దెలియుఁడు సత్కవులు మేలు దేటపడంగన్.

"ఇది యభినవదండి విరచితమయిన యాంధ్రభాషాభూషణం సంపూర్ణం." వ్రాయసగానిపేరు తెలియరాదు.

*మా. పరిషత్పుస్తక భాండాగారము-మూఁడవభాగము. పుట 15-18

## 22. ఆంధ్రభాషాభూషణము. 552

ఇది 22 పత్రములు గలది. ఈప్రతియందే వేంకటేశాంధ్రము మున్నగునవి గలవు.* వ్రాఁత బాగుగనున్నది. తప్పులుమెండు. గ్రంథారంభము వెనుకటివలెనే.

తుదిభాగము:—

క. తెలుఁగుల లక్షణములు భువి
నలవడుక్రియ దండిచేసె నవి యన్నియు నే
ర్పలరంగఁ జతురమతిన్
దెలియుఁడు సుకవీంద్రులెల్లఁ దేటపడంగన్.

ఇతి శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్య పుత్రబుధారాధన కవిరాజ తిక్కన సోమయాజి వరప్రసాద కవితావిలాస వేదశాస్త్రపురాణేతిహాస కళావినోద మోదమానస విచిత్రపుణ్యజనమనోభిత్తిరచితవైచిత్ర్యపదార్థ కవితానురంగ మంగళానుషంగ కనదభినవదండి సంచితఖ్యాతి కేతనామాత్యప్రణీతంబైన ఆంధ్రభాషాభూషణంబను శబ్దశాస్త్రంబునందు నేకాశ్వాసము.

## 23. ఆంధ్రభాషాభూషణము. 353

ఇది 22 పత్రములుగలది. వ్రాఁతబాగుగలేదు. తప్పులంతగలేవు. వ్రాయసగాని పేరు తెలియరాదు. అసమగ్రము. ప్రారంభము పూర్వమువలెనే.

తుదిభాగము:—

క. వినభూతార్థముఁ దెలుపుచు
గనుఁగొనఁగాఁ గర్తృకర్మ కరణంబులఁ బం
డిన కాపనఁ బండిన చే
ననఁ బిండిన కొల్చు నాఁగ ననువై యునికిన్.

---

*చూ. పరిషత్పుస్తకభాండాగారము-మూఁడవభాగము. పుట 26-27

## 24. ఆంధ్రభాషాభూషణము. 873

ఇందు 79 పత్రములు గలవు. వ్రాఁత బాగుగనున్నది. తొలుత 69 పత్రములు వక్కలంక వీరభద్రకవి రచియించిన వాసవదత్తాపహరణమను ప్రబంధము సంపూర్ణముగను, ఆవెనుక 10 పత్రములీ యాంధ్రభాషాభూషణము సంపూర్ణముగను గలవు. తప్పులంతగ లేవు.

గ్రంథము తుదిభాగము:—

క. వాఁడి మయూఖము లనఁగా
వేఁడి పయోధారలనఁగ వింజామరనా
మూఁడస్త్రంబు లనంగాఁ
బోఁడిగఁ గరకంఠనామముం బోలితగన్.

క. తెలుఁగునకు లక్షణము భువి......

ఇది యభినవదండి విరచితంబైన యాంధ్రభాషాభూషణము సంపూర్ణము.

## 25. ఆంధ్రభాషాభూషణము. 34.

ఇందు 100 పత్రములు గలవు. వ్రాఁత బాగుగనున్నది. తప్పులంతగ లేవు. పత్రములు మంచిస్థితిలో నున్నవి. వ్రాయసగానిపేరు గానరాదు.

తొలుత 54 పత్రములు కవిజనాశ్రయము. ఆవెనుక 14 పత్రములు ఆంధ్రభాషాభూషణము. పిదప 17 పత్రములు ఛందోవిషయము తుదిని 15 పత్రములు అంగజవిజయ మను యక్షగానమును గలవు. గ్రంథారంభము 'శ్రీవాణీగిరిజేశ' ఇత్యాదిగ నున్నది.

తుదిభాగము :—

క. తెలుఁగునకు లక్షణము భువి
నలవడఁగా దండి చెప్పె నభిధానమ్ములో
గల వన్నియు నేర్పడఁగా
దెలియుఁడు సత్కవులు దీని దెలిఁ నేర్పడఁగన్.

## ఈ ప్రతియందలి మూఁడవ ఛందోగ్రంథము.

ఈ గ్రంథమును రచియించిన కవి యెవ్వరో తెలియరాదు. ఇందు గణవిభాగము, నక్షత్రఫలములు, వృత్తలక్షణలక్ష్యములు, యతి ప్రాస స్వరూపోదాహరణములు, షట్ప్రత్యయములు, రగడలు మున్నగు విషయములు గలవు.

ప్రారంభము:—

అరయఁగఁ దూర్పుదెస నారయ నేర్చిన పద్మరాగమున్
చెరువుగ నగ్నిదెస శన రోహితచంద్రరోకాంతములు
పరఁగఁగ దక్షిణంబుదిశ దచ్చయు నైరుతియందు ము
దిరముగఁ బశ్చిమంబుదిశ నంతయు నెప్పిన రోహితంబగున్
అమరఁగ వాయువ్యముదిశ వజ్రము గోమేధికముం
ముత్తమంబుగ నీశాన్యమునన్ వైడూర్యము
ఇనుమీఁద నిలముగాంచు నిలుచుటయుఁ జూడ కీ
ఘనతరమదసూకరసునిశితదంష్ట్రాంకురంబు జొప్పన వ్రాయన్.
జను గురువులఘువు నిడ దైలనుపమ రవిరశోకశోభిత దనరున్.

క. మొదల నడుమ తుదిలఘువున్
గదిసిన యవి యరతలంటి కడలను గురువుల్
గదిసిన భజసల్ మనలకు
ముదమున గురు లఘువు లంక్రము మూఁడెసలందున్.

ఇఁక నిందుఁ జేర్కొనఁబడిన వళులు. దశవిధ వళ్లకు—

సీ. అబ్జగర్భస్వరాడాది పూజ్యపదాబ్జ
కమలాక్ష మౌనివర్గప్రసన్న
వైభవాఖండ దేవాధిదేవ కృపాబ్ధి
అఖిల విప్రాదిక ప్రాణనాథ
నుతపుణ్యసస్యబిందుయుతాననాంభోజ
అతిదయాపోత నిజామహాత్మ

స్వచ్ఛ పావనస్ఫూర్తి సంయుక్తసంచార
మహిమ యొక్కటిదైన మాన్యచరిత
పోల్ప నీపోలికకు దైవములును గలరె
పరనచారిత్ర భక్తరంజనచరిత్ర
ప్రాస నిర్భిన్నచండతరాసురేంద్ర
అఖిలయతిగణ్య రఘురామ అఘువిరామ!

గ్రంథాంతము:—జయభద్రం.
శ్రీకినోడయుఁడనంగ చిత్తజగురుం డనఁగ
చెలువగు చతుర్భుజుఁడు నాకౌకసుల నేలు
నలినసూదనుపూజ నడుమఁ దాఁ గైకొనిన
నందగోపాలాత్మజుఁడు ఇతని కోరికగాని
యిష్టవరములు గలుగ వితరసేవల నముచు
ననఁగ నవిభు……………………

## 26. ఆంధ్రభాషాభూషణము. 391

ఇది 15 పత్రములు గలది. వ్రాఁత బాగుగనేయున్నది. తప్పు లంతగ లేవు. గ్రంథపాతము లేదు. 'శ్రీ వాణీగిరిజేశ' ఇత్యాదిగ నారంభము. తుదిపద్యము,—

క. తెలుఁగునకును లక్షణ మి
ట్లలవడఁ బొనఁగించి చెప్ప నభిధానములన్
గల క్రియలన్నియు నేర్పడఁ
దెలియుఁడు సుకవులకు మేలు దేటపడంగన్.

ఈ ప్రతిలో నెల్లెడలను నరసున్న లుండుతావుల నెఱసున్నలు తప్పక చేర్పఁబడినవి. వ్రాయసగానిపేరుమాత్రము తెలియరాదు.

## 27. ఆంధ్రకౌముది. 3

ఇది మండ లక్ష్మీనృసింహకవి విరచితము. ఇందు 43 పత్రములు గలవు. వ్రాఁత బాగుగలేదు. అసమగ్రము. తప్పు లంతగ లేవు. తుది

పత్రములు శిథిలములు. వ్రాయసగానిపేరు తెలియరాదు. ఈ ప్రతి యందే కవిజనాశ్రయమును గలదు.*

గ్రంథారంభము:—

శ్లో. ౧. వాచేభద్రంభవతు వినతాసూనవేఽస్తు ప్రణామో
ధ్యాత్వాలక్ష్మీనృహరి మధునా మానసే సోమచంద్రం
కణ్వం సోమం భృగుమునిమహం పుష్పదంతం కవీంద్రం
విష్ణుం చంద్రం సురమునిగురుం నాగరాజం నమామి.

౨ ఆథర్వణాని కాణ్వాని బార్హస్పత్యాని సంవిదన్
కౌముదీ మాంధ్రశబ్దానాం సూత్రాణిచకరోమ్యహం

3. నాంచారమాంబాతనయ స్సూను ర్వరదయజ్వనః
లక్ష్మీనృసింహ సుకవీ రాజతే మండవంశజః

౪. అష్టభాషాసు నిరతో భాండీర ప్రాకృతాదిషు
వాచాచాతుర్యవిజిత త్రిదశాచార్యవాక్తతిః

పూర్వమే వాంధ్రభాషోత్పత్తి ర్భగవతా వాల్మీకినా ప్రోక్తా ప్రాకృతాదిషు కించ:—

౫. ఆంధ్రనాథో మహావిష్ణు ర్నిశంభు దనుజాపహః
పురా స్వయంభువ మనోఃకాలే కలియుగే హరిః

౬. కాకులే రాజవర్యస్య సుచంద్రస్య తనూభవః
అభవ త్సర్వదేవైశ్చ వేష్టితో లోకపూజితః

౭. శ్రీశైలభీమకాళేశ మహేంద్రగిరిసంయుతం
ప్రాకారంతు మహత్కృత్వాత్రీణి ద్వారాణి చాకరోత్

౮. త్రిలోచన స్స మాహేశ స్త్రిశూలంచకరే ధృతః
త్రిలింగరూపేణ వస త్త్రిద్వారేషుగణైర్వృతః

౯. ఆంధ్రవిష్ణుశ్చ సహితో దనుజేన నిశంభునా
యుద్ధ్వాత్రయో దశయుగాణ్ హత్వాతం రాక్షసాధమం

---

*చూ. పరిత్పుస్తకభాండాగారము, మూడవభాగము. పుటలు 33-34.

౧౦. అవసత్తత్ర ఋషిభిర్యుతో గోదావరీతటే
తత్కాలప్రభృతిక్షేత్రం త్రిలింగ మితి విశ్రుతం
౧౧. తత్రత్యాస్తత్సమాలాపాస్తత్కాలీనా హరేర్భటాః
కాలేన మహతా సర్వం తత్సమం స్వల్పబుద్ధిభిః
౧౨. అస్ఫుటేనోచ్చారితాని తద్భవానీతి సమ్మతిః.
వికర్ష వ్యత్యయాభ్యాంచ పాదార్ధోక్తి విశేషతః
౧3. తద్భవాశ్చేతి కథ్యన్తే కాలేన మహతాదృతాః
బ్రహ్మణా నిర్మితా వాచః పూర్వమాంధ్రోశితుర్హరేః
౧౪. అచ్ఛాఇతిచకథ్యన్తే సుప్కృద్ధాతుసమన్వితాః.

ఇందలి సూత్రములు వివరణమును సంస్కృతభాషను గలవు. ఉదాహరణములు మాత్రమాంధ్రభాషనుగలవు. పరిచ్ఛేదవిభాగము సరిగాఁ దెలియవచ్చుటలేదుగాని, యిందు సంజ్ఞా,సంధి, అజంత, హలన్త క్రియాపరిచ్ఛేదములలోని విషయములుగలవు.

తుదిభాగము :—

సూ. తినితిమ్యుత్తమే- ఉత్తమపురుషైకవచన బహువచనయోః క్రమాత్తిని తిమీ స్తః.

## 28. ఆంధ్రకౌముది 4510.

ఇది 27 పత్రములుగలది. ఇదియు మండ లక్ష్మీనృసింహకవి రచియించినదియే. సమగ్రము. వ్రాఁత చక్కఁగనున్నది. తప్పులంతగలేవు. పత్రములు క్రిమిదష్టములు. తుదిని “అక్షయనామ సం॥ చైత్ర శు ౧౫ సర్కి.........శ్రీవేదమూర్తులయిన నూకల పెద రామచంద్రశాస్త్రి గారికి వాకాడ కాపురస్థుడయిన కొత్తపల్లి ప్రకాశరాయుడు ఆంధ్రవ్యాకరణము............నాకు” అని కలదు.

ప్రారంభముపై ప్రతిని బోలియున్నది తుదిభాగము :—

అర్ఘ్యమిత్యత్ర - మనయామధోవర్తమానానాం - అధోవర్తమానానాం మనయానాం లోపస్స్యాత్ - ఇతియకారలోపే - అనంతరం

ఆంధ్రసాహిత్యపరిషత్ప్రకాశితము-సంఖ్య 48.

# సీతారామచరిత్రము.

(బాలకాండము)



మంత్రిప్రగడ సూర్యప్రకాశకవి.

# పీఠిక.

శ్రీమద్రామాయణచరిత్రము ననుసరించి (క్రీ. శ. 1851-52) విరోధికృద్వత్సరమున నాలుగాశ్వాసములుగా రచించిన యీ సీతారామ చరిత్రముయొక్క రచయిత, మంత్రిప్రెగడ సూర్యప్రకాశకవివరుఁడు పూర్వగోదావరీమండలాంతర్గతములగు కాకినాడకును పిఠాపురమునకును నడుమనుండు తిమ్మాపురమను గ్రామమున (క్రీ. శ. 1808) విభవ సంవత్సరమునందుఁ బుట్టెను. అతఁ డాఱువేలనియోగిబ్రాహ్మణుఁడు; హరితసగోత్రుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; శరభరాజామాత్యునకును సీతాంబకును బుత్త్రుఁడు; విస్సాప్రెగడ జోగిరాజునకును జెల్లాంబకును దౌహిత్రుఁడు. హరిశతకమును రచించిన కామరాజును, బరకుటుంబమునకు దత్తుఁడయిన సుబ్బారాయఁడు నాతని తనయులు. ఆయన మొదటఁ గందర్ప సీతారామశాస్త్రియొద్దను పిదప దేవులపల్లి తమ్మయసూరియొద్దను పిమ్మట వాడపల్లి పద్మనాభాచార్యునియొద్దను విద్యనేర్చి పండితకవియయి, ముప్పదివత్సరముల వయస్సున విశాఖపట్టణమండలాంతర్గతమగు మాడుగులు సంస్థానమునందుఁ బ్రవేశించి శ్రీకృష్ణభూపతిదేవమహారాజగారి యాస్థానకవియయి సకలభాగ్యభోగములను బొంది నిజకాలమును గడపెను.

అతఁడు పారిజాతాపహరణకథను విజయవిలాసకథను గలిపి (క్రీ. శ. 1863) దుందుభివత్సరఫాల్గునమాసమున రెండాశ్వాసములుగల

కృష్ణార్జునచరిత్రమను ద్వ్యర్థిప్రబంధమును రచించెను. అప్పాత్రమును 1908వ వత్సరమునందు బి. ఏ. కును, 1914వ వత్సరమునందు ఎమ్. ఏ. కును పాఠ్యపుస్తకముగాఁ జెన్నపురవిశ్వవిద్యాలయము నిర్ణయించెను. మఱియు నతఁడు (క్రీ శ. 1869) శుక్లవత్సరచైత్రమాసమున భీమలింగ శతకమును రచించి తన యిరువదిరెండవయేఁట (1873 సం॥ మే నెల తే 11 ది) శ్రీముఖవత్సర వైశాఖ శు ౧౪ భానువాసరమునందు స్ఫోటకవ్యాధివలన నిజతనువును త్యజించెను.

అతని కవిత్వము ధారాశుద్ధిగలిగి నిరుపమమై యొప్పెడిని.

జయపురము<br>౧-౪-౪౧.

ఇట్లు,<br>శ్రీ విక్రమదేవవర్మ.

# విజ్ఞప్తి.

ఈ గ్రంథము మంత్రిప్రగడ సూర్యప్రకాశకవిచే శ్రీమద్రామాయణము ననుసరించి రచింపఁబడినది. దీని మాతృకను బ్రకటనార్థము మాకు దయతో నొసఁగిన శ్రీ శ్రీ శ్రీ జయపురాధీశ్వరులగు శ్రీ విక్రమదేవవర్మగారికి మా కృతజ్ఞతాభివందనములు. శ్రీ వారు గ్రంథకర్తయందలి యభిమానముచే నీగ్రంథమున కొకచిన్నపీఠికయుఁ గఠినపదముల పట్టికనుగూడ వ్రాసి మాకొసఁగియున్నారు. వీరిదివఱలో నీకవిచే రచింపఁబడిన కృష్ణార్జునచరిత్ర మను ద్వ్యర్థికావ్యమునకుఁ డీకను వ్రాసి ప్రకటించియుండిరి.

కవి జీవితాది విషయములను గూర్చి విపులముగ వ్రాసి మాకొసఁగిన శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటు కార్యస్థాన పండితులగు శ్రీ నిడుదవోలు వేంకటరావుగారికి మేమెంతయుఁ గృతజ్ఞులము.

ఈ గ్రంథ మతివిస్తృతమగుటచే సంపుటములుగఁ బ్రకటింప నెంచి యందలి బాలకాండమును బ్రథమసంపుటముగఁ బ్రకటించితిమి. దీనిని బాఠకులు సాదరముగఁ బఠించి యానందింతురుగాక.

ఇట్లు,

ఆంధ్ర సాహిత్య పరిషత్కార్యదర్శులు.

# కవి జీవితము.

సీతారామచరిత్రమను నీమహాకావ్యమును రచియించిన మంత్రి ప్రెగడ సూర్యప్రకాశకవి కడచిన శతాబ్దమున వెలసిల్లిన కళింగాంధ్ర కవులలో మిక్కిలి ప్రసిద్ధుఁడు. ఈతఁడార్వెలనియోగిశాఖకుఁ జెందిన బ్రాహ్మణుఁడు. ఆపస్తంబసూత్రుఁడు. హారితసగోత్రుఁడు. శరభరాజునకు సీతమ్మకును బుత్త్రుఁడు. ఈసీతారామచరిత్రమునుండియు నీతని కృత్యంతరమగు కృష్ణార్జునచరిత్రమునుండియు నీతనివంశ మీట్లు తెలియుచున్నది.

హారితసగోత్రము.

శరభరాజు

వేంకయ (జోగమ్మ) — రామయ్య

వేంకయ (జోగమ్మ)

శరభరాజు (సీతమ్మ)

సూర్యప్రకాశకవి, (గ్రంథకర్త.)

సూర్యప్రకాశకవి మాతృవంశము వారు విస్సాప్రెగడవారు. ప్రకాశకవి మామయు మేనమామయునగు కామరాజకవి ప్రసిద్ధుఁడగు నాంధ్రకవి. ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రిక (18 సం. 2. సంచిక) యందుఁ బ్రకటింపఁబడిన "జరీజుపద్యము" లీకామరాజకృతములె. మఱియు రామచ్ఛాయభాషకుఁ బద్యముల్వ్రాసి చిత్రకల్పనలఁ గావించిన దీ కామరాజకవియే. * ఈతనిఁగూర్చి ప్రత్యేకముగఁ దెలుపుదును.

* ఈపద్యమును గూర్చియు, చిత్రకల్పనను గూర్చియు, శ్రీ రాయుడ్యారి రామభద్రప్రసాదరావువారు ఆంధ్రపత్రిక నల సంవత్సరాదిసంచిక పుట 278 లో వ్రాసిన విషయము చూడుఁడు.

సూర్యప్రకాశకవి కామరాజకవి నిట్లు తనసీతారామచరిత్రమునఁ బ్రశంసించియున్నాఁడు.

సీ. ఏమహాత్మునితాత యీశ్వరారాధన
    ప్రముదితస్వాంతుండు బసవరాజు
ఏగుణాధికుతండ్రి హిమశైల
    కైలాససురుచిరసత్కీర్తి జోగిరాజు
ఏసుధీమణియన్న భాసురాత్మజ్ఞాన
    పటుమనీషాశాలి బసవరాజు
ఏధన్యునూనుం డనేకబాంధవజన
    స్తుత్యసద్గుణవార్ధి జోగిరాజు
అట్టి విస్సాప్రెగడ సత్కులాంబురాశి
సోము సుకవిత్వధారాభిరాము నాకు
మేనమామయు మామయై మెఱయువాని
నధికకృతసఖ్యుఁ గామరాజాఖ్యుఁదలఁతు. (1-21)

సూర్యప్రకాశకవి క్రీ.శ. 1808 వ సంవత్సరమున గోదావరీమండలమునఁ గాకినాడ పీఠికాపురములకు నడుమనున్న తిమ్మాపురమను గ్రామమున జన్మించెను. ఈతఁడు తనబాల్యమునఁ దోలుత కందర్ప సీతారామశాస్త్రి యొద్దను నావెనుక దేవులపల్లి తమ్మయసూరియొద్దను బాపై వాడపల్లి యనంతపద్మనాభాచార్యులయొద్దను విద్యాభ్యాసముఁ గావించెను. ప్రకాశకవి పితృమాతృవంశములవారు విద్వత్కవులగుటచే నీతనికి సహజముగఁ గవితాధార యలవడినది. కేవలాంధ్రకవిత్వమేకాక పై పండితత్రయమునకు శుశ్రూషఁగావించి ప్రకాశకవి సంస్కృతకవిత్వమును, నుభయభాషాపాండిత్యమును సంపాదించెను.

పై గురుత్రయమును ప్రకాశకవి సీతారామచరిత్రమునను నీతని కృత్యంతరమగు కృష్ణార్జునచరిత్రమునను నిట్లు ప్రశంసించియున్నాఁడు.

కందర్ప సీతారామశాస్త్రి.

శా. సారోదారగభీరవాగ్జితసురాచార్యున్ సుధాహారనీ
హారక్షీరశతారపారదమరాళాంచద్యశోరాజితు
న్గౌరీనాథపదాబ్జచింతను లసత్కందర్పవంశాంబుధీ
ట్తారాపాలుని మద్గురుం దలఁతు సీతారామవిద్వన్మణిన్.

(సీతారామచరిత్రము 1-11)

శా. సీతారామపదారవిందయుగళీసేవాపరుం డాత్మవి
ద్యాతత్త్వవశవర్తిమానసుఁడు కందర్పాన్వయాంభోజఖ
ద్యోతుం డాశ్రితశిష్యవత్సలుఁడు సత్యోక్తివాసుఁడౌ మద్గురున్
సీతారామసుధీమణిం దలఁతు సత్కీర్తిప్రభావాన్వితున్.

(కృష్ణార్జునచరిత్రము. 1-9)

దేవులపల్లి తమ్మయసూరి.

ఉ. పావనవంశజాతనరపాలసభాంతరపూజ్యపూర్ణ వి
ద్యావినయాంచిసద్గుణవితానవిరాజితభూరికీర్తిఁ బ
ద్మావరపాదభక్తిరతు మద్గురుశేఖరు నీశ్వరోపమున్
దేవులపల్లి తమ్మయసుధీమణిఁ గొల్తు నభీష్టసిద్ధికిన్.

(సీతారామచరిత్రము. 1-12)

చ. దివిజగురుప్రసిద్ధమతి దేవులపల్లికులాబ్ధిచంద్రు మా
నవపతివర్గపూజ్యు సుజనప్రియపూతచరిత్రు నిందిరా
ధవపదపద్మభక్తిరతు దానవవైరిపురీనివాసు స
త్కవిజనవంద్యు మద్గురుని దమ్మయసూరివరున్ భజించెదన్.

(కృష్ణార్జునచరిత్రము. 1-10)

వాడపల్లి అనంతపద్మనాభాచార్యుఁడు.

ఉ. మానుగ సన్నుతించు బుధమాన్యచరిత్రుని మద్గురూత్తమున్
మానితవేదశాస్త్రబహుమార్గవిదున్ సుగుణాభిరాము వై

ఘూపనవక్యు విష్ణుపదకంజరతాత్ము వికుంఠమందిరా
సీనుని వాడపల్లికులసింధుసుధాంశు ననంతదీక్షితున్.

(సీతారామచరిత్రము 1-13)

శా. ఆచారాన్విత వాడపల్లికులపారావారతారాధిపున్
మోచాంచత్ఫలమాధురీవిలసితామోఘార్థయుక్సాహితీ
వాచానిర్జితనిర్జరాధిపగురున్ వైఖానసున్ పద్మనా
భాచార్యున్ బ్రణుతింతు మాధవపదాయత్తాత్ము సన్మద్గురున్.

(కృష్ణార్జునచరిత్రము)

ఈ గురుత్రయమున దేవులపల్లి తమ్మయసూరి, శ్రీ పీఠికాపుర సంస్థానవిద్వత్కవులై జగత్ప్రసిద్ధిఁగాంచిన శ్రీ దేవులపల్లి వారివంశము లోనివారు. శతలేఖనీపద్యచాతురీధురీణులును, సరసకవితాధురంధరులును శ్రీ రావు గంగాధరరామరాయమహారాజేంద్రు నాస్థానవిద్వాంసులును, నగు దేవులపల్లి సుబ్బరాయశాస్త్రులవారు తమ మహేంద్రవిజయమున నీ తమ్మయసూరిగారి నిట్లు ప్రశంసించియున్నారు.

సీ. సంతతాంతేవాసి చింతితవిద్యాస
మృద్ధిక్రియాహయగ్రీవమూర్తి
దినదినశ్రీరామదేవసేవాభినం
దిత మనస్సరణాంజనేయమూర్తి
నిత్యసూనృతభాషణాత్యంతతాత్పర్య
సాంద్రవర్తనహరిశ్చంద్రమూర్తి
సతతదీనావనవ్రతమహాకారుణ్య
విభవసంపూర్ణతావిష్ణుమూర్తి
అలరె హారిదుతకరిదంతవలయకాంత
మహితకలధౌతకటరాయమానకీర్తి
నయగుణస్ఫూర్తి తమ్మననామధేయు
సకలఖండితమండలీచక్రవర్తి.

సూర్యప్రకాశకవి తనతండ్రిని నిట్లు ప్రస్తుతించియున్నాఁడు.

క. ప్రవిమలభక్తి నుతింతును
రవిసన్నిభ తేజు శరభరాజసమాఖ్యున్
కవితామహత్త్వజితభా
రవికవి మజ్జనకు శరభరాజసమాఖ్యున్

శరభరాజుగా రిట్లు తనకుమారునిచే 'కవితామహత్త్వజితభారవి' యని పొగడ్త నొందినను నాతనిగ్రంథము లేవియుఁ గానఁబడుటలేదు. సూర్యప్రకాశకవి కనిష్ఠకుమారుఁడు కామరాజు హరిశతకమును రచియించియున్నాఁడు. పైని వివరించిన యంశములనుబట్టిచూడ సూర్యప్రకాశకవి తలిదండ్రులవంశములు రెండును కవి పండితవంశములే యని తేలుచున్నది.

సూర్యప్రకాశకవి విశాఖపట్టణమండలాంతర్గతమగు మాడుగుల సంస్థానాధీశ్వరుఁడును, భాషాపోషకుండును, పండితప్రభువునగు శ్రీకృష్ణ భూపతిమహారాజు నాస్థానకవియై తనజీవితకాలమంతయు సౌఖ్యముగ మాడుగులయందే గడపి, తే 11-5-1873 దిని కీర్తిశేషుఁడయ్యెను. కవిగారి కాశ్రయదాతయగు*శ్రీకృష్ణభూపతిమహారాజు క్రిందటిశతాబ్దమున నాంధ్రదేశమున విలసిల్లిన కీర్తిమూర్తులలో నొకరు. వీరు క్రీ. శ. 1813 లో జన్మించి 1835లో రాజ్యమునకు వచ్చి నలువదిసంవత్సరము లవిచ్ఛిన్నముగఁ బరిపాలించి తే 25-12-1875 దిని కీర్తిశేషులైరి. వీరికాలమున మాడుగులు విద్వత్సంస్థానమని ప్రఖ్యాతిఁజెందెను. శిష్టు కృష్ణమూర్తిశాస్త్రి, అల్లమరాజు సుబ్రహ్మణ్యకవి మొదలగు విద్వత్కవు లీమహారాజేంద్రునిచే సన్మానింపఁబడిరి. బులుసు పాపయ్యశాస్త్రి, ఇంద్రకంటి గోపాలశాస్త్రి మొదలగు శాస్త్రవిద్వాంసు లెందరేని యీతనిచే సంభావితులైరి. అడిదము బాలభాస్కరకవి, (అడిదము సూరకవి ప్ర

---

* శ్రీ శ్రీ శ్రీ సాహిత్యసామ్రాట్టు శ్రీ జయపురాధీశ్వర శ్రీ విక్రమదేవవర్మమహారాజేంద్రు లాంధ్రసాహిత్యపరిషత్పత్రిక ద్వితీయసంపుటమున నీమహారాజేంద్రుని జీవితచరిత్రమును లిఖించియున్నారు.

పౌత్త్రుఁడు) నిట్టల రాయలుకవి మొదలగు నాంధ్రకవు లీసంస్థానాంధ్ర కవులై ప్రకాశకవితోఁగూడఁ బ్రకాశించిరి. ఈవిద్వత్ప్రభువుపైఁ గవులు రచించినపద్యము లెన్నియేని కలవు. వానిలో నిట్టల రాయలుకవిగారి తారావళియు, అల్లమరాజు సుబ్రహ్మణ్యకవిగారి కృష్ణభూపతిలలామ శతకమును మిక్కిలి ప్రసిద్ధి కెక్కినవి. వీనిలో కృష్ణభూపతి తారావళిని శ్రీ జయపురాధీశ్వరులు శ్రీ విక్రమదేవవర్మమహారాజేంద్రులు కృష్ణ భూపతిమహారాజు జీవితమునందే ప్రకటించిరి. సుబ్రహ్మణ్యకవి కృతమగు శతకమును వారే నలువదేండ్లక్రిందట ముద్రించి ప్రకటించిరి. ఇందు నూఱు సీసపద్యములు గలవు. మత్స్యకులదీప దివ్యమన్మథ సరూప, పరమగుణధామ కృష్ణభూపతిలలామ యను మకుటము. పద్యములన్నియుఁ బ్రౌఢములై ప్రభువర్యుని భాషాపోషకత్వము పాండితీసంభావనము ప్రస్తుతౌదార్యాదిగుణగణమునుఁ గీర్తించుచుఁ బ్రశస్తములై వెలయుచున్నవి. ప్రకాశకవిగారు తమపూర్వజన్మపుణ్యవశంబున నీమహారాజేంద్రుని మన్ననకుఁ బాత్రులై యీక్రింది గ్రంథముల రచియించిరి.

1. సీతారామచరిత్రము—ఇందు శ్రీరామాయణకథ యాఱాశ్వాసముల యాంధ్రమహాకావ్యముగ వెలసినది. దీనినిఁ గవిగారు (క్రీ. శ. 1851-52 లో) విరోధికృద్వత్సరమున రచియించిరి. దీనినిఁ బ్రకటించుభాగ్య మాంధ్రసాహిత్యపరిషత్తువారి కబ్బుట ప్రశంసనీయము.

2. కృష్ణార్జునచరిత్రము—ద్వ్యర్థికావ్యము పారిజాతాపహరణము విజయవిలాసకథ లిందు మేళగింపఁబడినవి. ఇందు రెండాశ్వాసములు గలవు. కవిగారు దీనిని (క్రీ. శ. 1863 లో) దుందుభివత్సరమున రచించిరి. ఇప్పటికి ముప్పదేండ్లక్రిందట నీగ్రంథము టీకతోఁ గూడ ముద్రింపఁబడినది. శ్రీజయపురాధీశ్వరులు శ్రీవిక్రమదేవవర్మ మహారాజులే దీనికిఁ డీక వ్రాసి ముద్రణభాగ్యము గలిగించిరి. ఈటీకవలన శ్రీ శ్రీ మహారాజేంద్రుల యుభయభాషావైదుష్యము ప్రద్యోతమానమగుచున్నది.

3. భీమలింగశతకము—సూర్యప్రకాశకవిగారు తమ యభీష్టదైవ మగు భీమలింగస్వామిపేర నీశతకము శుక్లసంవత్సర (1869) చైత్రమాసమున రచియించిరి. ఇం దన్నియుఁ గందములు. "భీమలింగ కలుషవిభంగా" యనునది మకుటము. దీనిని శ్రీ జయపురాధీశ్వరులు శ్రీ విక్రమదేవవర్మమహారాజేంద్రులు క్రీ. శ. 1897 వ సంవత్సరమున ముద్రింపించి ప్రకటించిరి. ఇయ్యది భక్తిపరముగ నేగాక లోకనీతిబిలసితమై యొప్పుచున్నది.

మచ్చునకు ముచ్చటఁగూర్చు మూఁడు పద్యము లుదాహరించెదను.

క. చెలువమర రాజసభలను
బలుకని నరునోరు బుధులఁ బాసినయూరున్
కలిగియు లేనిదనంబును
కలకంధర భీమలింగ! కలుషవిభంగా!

క. కాయలు లేనిమహీజము
కోయిల లేనట్టి వనము గుడిలేని పురం
బాయతమోదముఁ జేయదు
కాయజహర! భీమలింగ! కలుషవిభంగా!

క. జీతంబు లేనికొలువును
దాతలు లేనట్టి పురము తమిలేని కవల్
ఖ్యాతినిఁ బొందకయుండును
కౌతుకయుత! భీమలింగ! కలుషవిభంగా!

'తత్పురుషబహువ్రీహుల సత్పురుషులు రామదాసశబ్దార్థమిలన్' ఇత్యాదిపద్యములఁ గవి తనసంస్కృతభాషాపాండిత్యము వెల్లడించినాఁడు.

సూర్యప్రకాశకవి శ్రీకృష్ణభూపతిమహారాజేంద్రునిపై నిఁ జెప్పిన శ్లోకద్వయమును, వేఱొకశ్లోకమును అల్లమరాజు సుబ్రహ్మణ్యకవి తన

చాటుధారాచమత్కారసారమునఁ గూర్చి, వానిని వ్యాఖ్యానించి యున్నాఁడు. ఆశ్లోకముల మూఁటి నిం దుదాహరించుచున్నాఁడను.

శ్లో. చేతుళే గోతుళే బాలే కాకులే వానముక్కులే
రుచిం పశ్యామి సుశ్యామే కచానాం తవ మంజులామ్.

(ఇందులఁ బూర్వపాదము తెలుఁగని భ్రమింపఁజేయును)

శ్లో. కృష్ణభూపతిసంకాశం కృష్ణభూపతిసన్నిభం
కృష్ణభూపతిసీకాశం కృష్ణభూపతిసదృశః

శ్లో. విక్రమే ణార్జునముఖాః కృష్ణభూపాల తే హితాః
విక్రమేణార్జునముఖాః కృష్ణభూపాల తే హితాః

శ్రీ సాహిత్యసామ్రాట్టు శ్రీ శ్రీ శ్రీ జయపురాధీశ్వర, శ్రీ విక్రమదేవవర్మమహారాజేంద్రులు చిరకాలముక్రిందట ననఁగా క్రీ.శ. 1905 వ సంవత్సరమున టీకాసహితముగఁ బ్రకటించిన కృష్ణార్జునచరిత్ర పీఠిక నాకెంతయేని యుపయోగించినది. కావున నాకృతజ్ఞత నిందుమూలముగ శ్రీ ప్రభువువారికిఁ దెలుపుకొనుచున్నాఁడను. సూర్యప్రకాశకవి కృతములగు తక్కినరెండుగ్రంథము లిప్పుడు లభ్యములు కాకుంకుటచే వానినిఁ గూడ సీసీతారామచరిత్రములోఁ బునర్ముద్రణము గావించి, కవికీర్తినిఁ బ్రకాశింపఁజేయుదురుగావుతమని.

సప్రశ్రయముగ విన్నవించు,
విధేయుఁడు,

పీఠికాపురము, 24-4-1941.

నిడుదవోలు వేంకటరావు.
శ్రీ సూర్యరాయాంధ్రభాషానిఘంటుకార్యస్థానపండితుఁడు.

# సీతారామచరిత్రము.

## కథానుక్రమణిక.

### ప్రథమాశ్వాసము.



---